గాన మనకంటెఁ గడు మేలు కాశినుండు
కీటపక్షిసరీసృపక్రిమికులంబు. 46

సీ. కాశికానగరంబుకడసీమమున నున్న
చండాలుఁ బోల డాఖండలుండు
నానందవనములో ననశనస్థితి నున్కి
భువనసామ్రాజ్యవైభవముఁ బోలు
నవిముక్తదేశస్థుఁ డయ్యెనేఁ బతితుండు
నశ్వమేధాధ్వరాహర్త దొరయు
వారణాసీసంభవం బైనమశకంబు
నైరావణముతోడ నవఘళించు

తే. నాటుకొని శ్రీమహాశ్మశానమున నున్న
యణుకనగ్నాలవటుఁ డైన నాగ్రహమున
గర్వితోద్ధతి నేతెంచుకాళరాత్రి
మృత్యుదేవతముసిపండ్లు మెఱుకఁ జాలు. 47

తే. ఎన్నికల్పంబు లరిగిన నెడలిపోవ
దెంద రింద్రులు గడచిన నెలమి దప్ప
దెన్ని మన్వంతరంబులు చన్న నెపుడుఁ
బసిమి దప్పదు కాశికాపట్టణంబు. 48

ఉ. తత్తరపాటు లేక నదిఁ దాన మొనర్చి పినాకపాణి దే
వోత్తము విశ్వనాథుఁ గరుణోదధిఁ గమ్మనిపూవుగుత్తులన్
బత్తిరిఁ బూజ చేసి నుతిపాఠములన్ రవణించువారికిం
దొత్తులువో లెనుబ్బుదురుదొప్పలుదోరలుముక్తికామినుల్.

సీ. ధర్మంబు కాశికాస్థానమధ్యంబున
నాల్గుపాదంబుల నడచి యాడు

చంద్రకళయట్లు శుక్లపక్షంబు రేలు
నాఁడునాఁటికి గనువర్ధనంబు కరణి. 52

సీ. పాలిండ్లు గదలంగఁ బసపుఁబయ్యెద వీచు ?
నచలాధిపతికూర్మియాఁడుబిడ్డ
ఘూత్కార మొనరించుతొండంబుముక్కున
శీకరాసారంబుఁ జిలుక డుంఠి
ప్రత్యక్షమై వచ్చి భాగీరథీగంగ
వృషలహస్తము సాఁచి మేఁపు నివురుఁ
ప్రమథోత్తముఁడు భృంగి భయరక్షణార్థమై
ఫాలాగ్రమునఁ దిద్దు భసితరేఖ
తే. దక్షిణశ్రుతి మీఁదుగా ధాత్రిఁ ద్రెళ్ళి
పెద్దనిద్రకు వ్రాఁగన్ను పెట్టువేళఁ
బంచజనులకుఁ దారకబ్రహ్మవిద్య
యభవుఁ డుపదేశ మొనరించు నపుడు కాశి. 53

వ. అని వారణాసీపురంబు వర్ణించుచు. 54

తే. వృక్షశాఖాంచలంబుపై వ్రేలుచున్న
కోటిసంఖ్యల నీర్కావికోర్పణములు
విఘ్నమృగములఁ బట్టంగ వేసినట్టి
చిరతెర లనసంస్మృతిఁ జిగురు గొలుపు. 55

సీ. ఎదుర లోపాముద్రపదపద్మములముద్ర
సికతిలం బగునేలఁ జెలువు మిగుల
శ్యామాకముష్టియాచ్ఞార్థంబు మృగములు
ఋషికన్యకలరాక కెదురుచూడ

దేవాఙ్ఘ్రినాఘూకాన్యగంధములచే
పాదపద్మములుగావి వొద్ది పరగు
కుచకస్వాభాగ్యమనస్సంపోహాంబు
కాశికాకంబులు నప్పు చేయఁ

తే. గాశికాక్షేత్రమునందుఁ గ్రోశమాత్ర
మహాగంగాప్రవాహసైకతభూమి
బ్రహ్మలోకమునకు సముద్రాప మైన
కలితజానుక్షేత్రాల దక్షణికి వారు. 56

వ. అప్పుడు. 57

మ. శివుఁడే దాత శివుండె భోక్త శివుఁడే చేయు న్మఖాదిక్రియల్
శివుఁడె విశ్వమునేశివుండె నటుచుఁ జింతించుచుఁ జాహ్నవీ
సవిధ శ్రీఫలవృక్షవాటముఁ భస్మస్నానశుద్ధాంగుఁడై
భవ! కాశీధవ! నీలకంఠ! యనుచుఁ భావించుభవ్యాత్మునిన్.

క. రుద్రాక్షభూతిముద్రా
ముద్రితనిఖిలాంగయవుని ముక్తిపదశ్రీ
భద్రాసనస్థు లోపా
ముద్రాపతిపూర్ణపాద్యు మునిపుంగవునిన్. 59

మ. నిజధామంబున శంభులింగము భవానీవృక్కదంబంబు నం
బుజగర్భాదిసురేంద్రవందితపదాంభోజంబుఁ గల్పించె మం
త్రజపధ్యానపరాయణుండగు మందత్ప్వర్ణంబునఁ దీపిరా
దక్షిణాగ్రంబునసున్న పాశుపతవిద్యారాజ్యపీఠస్థునిన్. 60

క. పాటలజటాకిరీటు ల
లాటంతపసప్తసప్తి లలితమనోజ్ఞ

స్ఫాటికమణిజపమాలా
వ్యాపృతకరసరోరుహాంగుళి సాక్ష్యన్. 61

క. పంచబ్రహ్మంబును శ్రీ,
పంచాక్షరమును నఘోరపారసరంబున్
గించిత్ప్రస్ఫుటపథరో
ష్ఠాంచలముగ జపము సేయునాదిమశైవున్. 62

మ. అపధానంబున నప్పటప్పటికి భక్త్యావిష్టుఁడై పార్వతీ
ధవ! గంగాధర! నీలకంఠ! మదనధ్వంసీ! మహాదేవ! రు
ద్ర!విరూపాక్ష!భుజంగహార!యమసంహారా! ధరత్ర్యావాసం
భవగర్జారభటిన్ బఠించుఁ బరమబ్రహ్మర్షిలేఖర్షభున్. 63

సీ. అంతర్విలోకనవ్యాప్తి యభ్యసించి
బాహ్యంబునకు దృష్టి పాఱ విడిచి
లీల రుద్రాక్షమాలిక దక్షిణశ్రవ
శ్శష్కులిశిఖయందు సంతరించి
పడిలంబుగా మున్ను పరిశీలించినయట్టి
నలినాసనంబుబంధము వదల్చి
వేదాగమపురాణవిద్యోద్భవము లైన
పురమర్దనస్తోత్రముల పఠించి

తే. యప్పు డప్పుడ యోగసమాధి యుడిగి
యధికశాంతిఁ బ్రసన్నాత్ముఁ డైనవానిఁ
బ్రణవపంచాక్షరీమంత్రపరమసిద్ధుఁ
గుంభసంభవమునిఁ గనుంగొనిరి వారు. 64

తే. జయజయధ్వను లెసఁగంగ సంయములును
నమరులును మ్రొక్కి రపుడమ్మహాత్మునకును

వ. అని పలికి వాచస్పతి పుష్పంబునకు వాసనయుంబోలె నవినా భావసంబంధంబున నమ్మహామునికి సహధర్మచారిణి యై యరుంధతికి సావిత్రి ననుసూయకు శాండిల్యకు సరస్వతికి లక్ష్మి కుమకు శతరూపకు మేనకకు సునీతికి సంజ్ఞకు స్వాహకుం దోడిజో డగులోపాముద్ర వీక్షించి యిట్లనియె. 70

బృహస్పతి లోపాముద్రకుఁ బతివ్రతాధర్మంబులు సెప్పుట

తే. అమ్మ! కుశలంబె? సాధ్వి! యనామయంబె?
దేవి! భద్రంబె? లెస్సలా? పూవుఁబోఁడి!
సారపరమపతివ్రతాచారవైభ
వాధిరాజ్యంబు జరుగుచున్నదియె? తరుణి! 71

సీ. ప్రాణేశుఁ డారగింపక భుజింపవు భర్త
నిద్రింపకయమున్న నిద్రవోవు
నాథుండు మేలుకొనకమున్న మేల్కాంతు
కైసేయ కెన్నఁడుఁ గదియ వధిపు
ధవుఁడు రోషితుఁడైన సతటె వాడి యుండుదు
పతికి నెప్పుడు మాఱు పలుక వీవు
పురుషునీగికి నల్ప మనక సంతోషింతు
మొగ మెత్త నేరవు మగనియెదురఁ

తే. జెఱఁగుమాసినమూన్నాళ్లు సిగ్గుతోడఁ
బతివిలోకనమార్గంబుఁ బరిహరింతు
సవిత్రుఁ డుదయింప నాల్నాళ్ల జలక మాడి
చూడ వెవ్వారిఁ బెనిమిటిఁ జూతు కాని. 72

మ. పసపుంగుంకుమకజ్జలంబునుదుగూర్పాసంబు తాంబూలముం
గుసుమంబుల్ కబభరీరంబుచెవియాకుల్ మంగళాలంకృతుల్

వినుపాక్షికంతయు లేకతాల్పవలయుఁ వీనిఁ సదాకాలము
స్పృహఁ జక్కంగఁ బ్రియుండు వర్ధిలుటకై నాళీకపత్త్రాక్షికిన్.

తే. కపికితోడ నుపకర్ణతో శ్రమణతోడ
విధవతో వాఘుతో రాయువెలఁదితోడఁ
జెడిపెతోఁ బోరాములు సేయ వలదు
ప్రాణసంకటములను బుణ్యాంగనలకు. 74

సీ. పతి పిల్వఁబంచినఁ బని యేమి యని వచ్చి
చెప్పినయడిగంబు సేయవలయు
స్వాతంత్ర్యమంత లేక ప్రకృతిబంధునికైన
నేపదార్థంబుఁ నీఁగి నెట్టి
పతితేశ్వరుఁడు డించినయోగిసంబులు
గుత్స సేయక భుక్తి గొనఁగఁదగవు
సుఖసుప్తుఁ డగుని జేసనిఁ బ్రబోధ మొనర్పఁ
గా దనుష్ఠానభంగముల దప్ప

తే. నొంటి నెచ్చోటఁ గపఁగుట యుక్తి గాదు
తమువు గట్టక నీరాడఁ దగవుగాదు
కడపమీఁదను మఱి యన్ని కంటిమీఁదఁ
జక్కిమీఁదను గూర్చుండ జాడ గాదు. 75

క. నాగరికత్వము వాచా
ప్రాగల్భ్యము జూపఁ దగదు పతిమువపట సం
భోగక్రీడావిభవా
ద్యోగంబులఁ దక్క పతికి సుప్పలనయనా! 76

క. ఇది ధర్మం బిది యీలువు
ఇది వ్రత మిది సద్వివేక మిది యాచారం

బిసి దేవపూజ యిసి? పతి
యుదితం బాలంబు సేయ కుంపటి పతికిఁ. 77

క. కాంతుఁడు సంతోషించిన
సంతోషింపంగ వలయు సతి కతఁ డార్తిన్
సంతాపించినపట్టున
సంతాపింపంగ వలయు జలజేక్షణకున్. 78

వ. కొందఱు కులటలు పతి దురవస్థఁ బొందినఁ దెవ్వులుపడిన శృంఖలాబద్ధం బైనను బరిత్యజింతురు. కొందఱు దుష్టమతులగుసుతులు లేమిం గొతుకుపడినభర్తనధికకార్పణ్యంబు పచరించి సర్వస్వహరణార్థలతండులాదులకై సిబ్బితి పలుతురు. కొంద ఱిచ్ఛావతులు ప్రియుండు దమకు నేమి యిచ్చిన మెచ్చక హెచ్చు కుందాడుదురు. కొందఱు పరాకులేకేకాకినులై మగని మొఱఁగి యెక్కడికేనియుం జనుదురు.కొందఱు దుశ్శీల లశ్లీలవాక్యంబుల నందంద బ్రియునిముందట మందెమేలంబునం బ్రేలుదురు. ఇందఱు నాథునిం గులంబు వారిని నరకంబునం ద్రోచి తారును నంద కూలుదురు. 79

సీ. చీఁకటితప్పు చేసిన సరోరుహనేత్ర
గూబ యై చరియించుఁ గోటరమున
వింతవానిఁ గటాక్షవీక్షణంబునఁ జూచు
కిసలయోష్ఠి వహించు గిల్లకన్ను
మగఁడు దన్నొత్తిన మార్తొత్తునలివేణి
వ్యాఘ్రియై చరియించు వనములోనఁ
జిఱుదిండి తనవారి మొఱఁగి యాహారించు
నతివ సూకరజాతియందుఁ బుట్టు

తే. నక్తవ్రుఁ గోపించి హుంకార మాచరించు
పడఁతి మూఁగ గాను సవతిసౌభాగ్యలక్ష్మిఁ
జూడఁ జాలక మదిలో నసూయ సేయు
భామ దుర్భగ యగు నన్యభవమునందు. 80

ఉ. దూరముపోయి యొండఁబడి దూపిలివచ్చిన ప్రాణనాథునిన్
ద్వారకవాటదేహళులదాఁక నెదుర్కొని తీర్థ మార్చి యా
హారము పెట్టి వీడ్యము సమర్పణచేసి విహారశయ్యపై
నూఁపవు లొత్తి చిత్తమున కుబ్బొనరించుట ధర్మమింతికిన్.

తే. తగవు పాటించి యల్పంబు దండ్రి యిచ్చు
నల్ప మల్పంబ భ్రాతయు నాత్మజుండు
ప్రార్థితం బైనధన మెంతయైన నిచ్చు
ప్రాణనాథుని సరియె యేబంధువులును ? 82

సీ. ఓర్పుమై నుప్పిండి నుపవాస ముండనీ
మగనాలిసరిఁ బోల్పఁ దగదు విధవ
తిరిగి నానాపుణ్యతీర్థంబు లాడనీ
మగనాలిసరిఁ బోల్పఁ దగదు విధవ
సమధికంబగు నిష్ఠ జపములు సేసిన
మగనాలిసరిఁ బోల్పఁ దగదు విధవ
సద్భక్తి దేవతార్చనము సేయంగనీ
మగనాలిసరిఁ బోల్పఁ దగదు విధవ

తే. నిద్ర మేల్కాంచి రేపాడి నియమపరత
నహిమభానుని వీక్షింపనియటకమున్న
తగదు (వీక్షింప) నరునకుఁ జూడంగఁ దల్లి వదినె
నత్తగారిని దప్పించి యన్యవిధవ. 83

ఉ. జీవముతోడఁ బాసి యశుచిత్వముఁ బొందిన మేరుగంధతో
యావభృథాభిషేకము సహస్రఘటంబుల నాచరించినన్
బావన మౌనె, యట్ల పతిఁ బాసి వితంతుత నొందినట్టిరా
జీవదళాయతాక్షి యశుచిత్వము వాయదు వేయుభంగులన్.

తే. ప్రియము గలిగిన నంగీకరింపవలదు
ముండమోపన రేపాడి మోముఁ జూచి
బైసిమాలిన పరమనిర్భాగ్యురాలు
విధవ పాపిష్ఠి యాశీస్సును విషసమంబు. 85

సీ. పెండ్లినాఁడు భూబృందారకులు గన్య
నప్పగించిరో లేదో యధిపుఁ గూర్చి
సహచారిణివి గమ్ము సకలకాలమునందు
నిండుఁజందురునిఁ జంద్రికయుఁ బోలెఁ
దొలుకరిమొగులు విద్యుల్లేఖయును బోలె
ననుగమింపఁగఁ బాడి యతివ మగనిఁ
బితృవనంబునకు వాఁకఁ బతివిమానము వెంటఁ
గైసేసి కొలనాఁడఁ గదలుభంగిఁ

తే. బిఱికికడ యొకింత లే కఱిమి వేడ్కఁ
జిచ్చుఱకఁ బోవు కచరాజీవనేత్ర
కశ్వమేధంబుఫలము తథ్యంబు గలుగుఁ
బద(ము) పదమ్మున కిదె వేదభాషితంబు. 86

తే. పుట్టలోపలిపాము నభ్యుద్ధరించు
వశ్యమంత్రుండు పాములవాఁడపోలె
భర్త నభ్యుద్ధరించుఁ బాపంబువలన
నగ్ని నుఱికినయట్టి పద్మాయతాక్షి. 87

గీ. వెక్కుమాటల నిటు జాలిపెట్ట నేల
సాధ్వి గర్వింప నొకఁ డెట్టు చాలఁ గలఁడు?
గంధవాహంబు వెలికి నక్కలువకంటి
పసప్రసయ్యేక పాలింపఁ బాయఁ దట్టి. 88

తే. ఔర్వశిఖికంటె జముకంటె నర్కుకంటెఁ
బిడుగుకంటెను దీవ్రమై బిలుసు చూపు
నాత్మఁ దప్పఁగఁ దలఁచుదు రాత్మకులకు
నహహ! పతిదేవతప్రతాతిశయము. 89

చ. తొలఁగుదు రంత నంత యమదూతకిరాతులు భీతచిత్తులై
కలుషసమన్వితుం డయినకాంతునిదారుణలోహపాశబ్రం
ఖలికలు విచ్చి పుచ్చుకొని కాంతచితాగ్నిశిఖాముఖంబునన్
వెలువడియాత్మభర్తవెనువెంటవహుటావహుటిఁగూడివచ్చినన్.

తే. ఎన్నికకు రోమకూపంబు లెన్ని గలవు
దివ్యవర్షంబు లన్ని మోదించు సాధ్వి
నాకభువనంబునం దాత్మనాథుఁ గూడి
వెలి పాకింతయు లేక చిచ్చులికె నేని. 91

తే. చంద్రవంశంబునం దేడుదరములకును
దల్లివంశంబునం దేడుదరములకును
ధవునివంశంబునం దేడుదరములకును
శాశ్వతస్వర్గసౌఖ్య మీఁ జాలు సాధ్వి. 92

వ. అని పలికి బృహస్పతి లోపాముద్రం గనుంగొని దేవీ! నీప్రసంగవశంబునంగొన్ని యోషిద్ధర్మంబులు చెప్పితి. నీవు మహాపతివ్రతవు. నీకోటిపుణ్యాలతులుకొందరుగలుగంబట్టి గదావసుంధరవిరంబై యున్నయది. ఇదె నీకు నమస్కారంబు.

క. మావచ్చిన కార్యమునకు
నీ వనుకూలత భజించి నిర్మలకరుణా
శ్రీ వెలయఁగఁ బ్రార్థింపుము
నీవల్లభు భువనకుశలనిర్వాహకునిన్. 94

వ. అని యగస్త్యమహామునిం జూచి వెండియుం బ్రణమిల్లి యాఖండలగురుం డి ట్లనియె. 95

బృహస్పతి యగస్త్యునితోఁ దమవచ్చినకార్యంబు సెలవిచ్చుట

సీ. ప్రణవంబు నీవు నిర్మలగుణాలంకార!
యామ్నాయవిద్య యీయలరుఁబోఁడి
తప మీవు శశికళోత్తంసభక్తినిధాన!
శాంతి యీసంపూర్ణచంద్రవదన
ఫల మీవు వాతాపిఖలదర్పభంజన!
సత్క్రియ యీగంధసారగంధి
మిహిరుండ వీవు విశ్వహితప్రవర్తక!
చైతన్యలక్ష్మి యీచపలనయన
తే. బ్రహ్మతేజంబు నీయందుఁ బ్రజ్వరిల్లుఁ
బ్రజ్వరిల్లుఁ బతివ్రతాపరమతేజ
మీలతాతన్వియందు మా కింపలరుచు
నుభయతేజంబులును మహాభ్యుదయ మొసఁగు. 96

తే. శక్రుఁడీతండు శిఖి వీఁడు జముఁడు వీఁడు
రాక్షసుఁడు వీఁడు పాథోధిరాజు వీఁడు
పవనుఁడును కిన్నరపతి యితండు
వృషభవాహుఁ డీతండు విశ్వవంద్య! 97

వ. వీరె మునులు. వీరె సిద్ధసాధ్యమరుత్కిన్నరకింపురుషగంధ
ర్వవిద్యాధరు లగు దేవయోనులు. మావచ్చినకార్యం బవధ
రింపుము కింభవ్యం బాయమహీధరంబు విబుధశైలంబుతోఁ బ్ర
తిస్పర్ధించి బ్రహ్మాండకర్పరంబు నిజశిరశ్శృంగశృంగాట
కంబుల నుల్లేఖించుచు రవియనూరుసారథిరథం బవరోధించి నక్ష
త్రగ్రహతారకాచక్రంబుఁ జిక్కుపఱచి సప్తసమీరణస్కంధం
బులకుం బ్రతిబంధించి శింశుమారాకారంబునం దారకా
వీథిఁ బర్యటించిన పాంచజన్యధరు నౌరసి యౌత్తానపాది
నుత్తరించి గగనగంగనాలింగనంబుచేసి యురులింగాకారుఁ
డై నధూర్జటిం ద్రివిక్రమాకారంబున విరాడ్రూపుం డగు వి
ష్వక్సేను ననుకరించియున్నయది. తృటినిమేషకాష్ఠాకళా
ముహూర్తాహోరాత్రపక్షమాసర్త్వయనసంవత్సరయుగసం
ధ్యాసంధ్యాంశమన్వంతరకల్పమహాకల్పాదిభేదభిన్నం బైప
దార్థంబులం బరిచ్ఛేదించుకాలంబు నిరస్తసమస్తోపాధికస్వప్ర
తిష్ఠాఖండసచ్చిదానందైకరసాద్వితీయ రూపుం డైన విరూపా
క్షుం డు దప్పించి యశేషంబును బరిచ్ఛేదించు. అట్టికాలంబున
కుం దపనపరిస్పందనంబు మూలంబు. మార్తాండుండు కొండ
ప్రక్కఁ జిక్కుపడలి మొగయక్కలిందగులుపడిచిక్కిన జోగునుం
బోలె నెడుదు నడవ మఱలం బఱవలేక చీకాకుపడియున్న
వాఁడు. ప్రాహ్ణాపరాహ్ణమధ్యాహ్నసమయంబులు గత్తరఁగ
లసింపంజేసి నిత్యనైమిత్తికాదిక్రియాకలాపంబు లుప
సంహృతంబు లయ్యె. ప్రాచ్యోదీచ్యదేశంబు లంధకారా
తతహిమానిలంబులచేతం జేతనావైకల్యంబు వహించె.
భువనంబుల కకాండప్రళయం బావిర్భవించె. కల్పాంతకా

లంబునందును గసుగందకుండుం గావున నవ్వేసవిఁ గాశీ క్షేత్రంబునందునుండవలతి చూపదు. ఏమును నిమ్మహోపద్రవం బునకుం బ్రశాంతిఁ గోరి యబ్రహ్మణ్యంబు సేయుచు బ్రహ్మ శరణు సొచ్చితిమి. అవ్విరించి కరుణాకటాక్షంబున నీక్షించి యీయాపద యపనయింప వాతాపిహారితాపసుండు దక్కం దక్కినవాఁడు సమర్థుండుగాఁడు. అతనిం బ్రార్థింపుఁడు, పొం డని తాన నీకిందువ చెప్పిన నీయానందవనంబున కరుదెంచి తిమి. ఇఁకమీఁదఁ గోపాటోపావకుంఠకంఠకఠినహుంకార ధారావష్టంభంబునం ద్రివిష్టపరాజ్యలక్ష్మీమదాంధుం డైన నహుషుని నిమిషమాత్రంబున ధాత్రీమండలంబునం బడఁ ద్రోచిన మహానుభావుండవు. నీవ ప్రమాణంబు. 98

క. ఎవ్వఁడు నిసర్గకఠినుం
డెవ్వఁడు సన్మార్గరోధి యీర్ష్యాపరుఁ డై
యెవ్వఁడు దన కధికునితోఁ
జివ్వకుఁ జేసాఁచు వానిసిరు లధ్రువముల్. 99

వ. అనిన వాచస్పతిపలుకు లాకర్ణించి యమ్మునిపుంగవుం డిట్లనియె.

తే. యత్న మొనరింతు నీకార్య మనువుపడఁగ
జనుఁడు మీమీనివాసదేశముల కర్థి
నున్న వాఁడు గదా! వీఁడె యుమయుఁ దాను
గాశికాభర్త మనపాలికల్పతరువు. 101

వ. అనిన వారును మహాప్రసాదం బని సముచితప్రకారంబునం గుంభసంభవుని వీడ్కొని నిజనివాసంబులకుం జనిరి. అనం తరంబ యగస్త్యుండు లోపాముద్రం జూచి యి ట్లనియె.

అగస్త్యుండు కాశీవియోగంబునకుఁ బరితపించుట

తే. కమలలోచన! మనుజుఁ డొక్కటిఁ దలంప
దైవ మొక్కటిఁ దలఁచు టెంతయు నిజంబు
కాశిఁ బెడఁబాయ నని నేను గదలకుండఁ
గాశిఁ బెడఁబాపె దైవంబు కరుణలేక. 103

తే. అప్పటికి నియ్యకొంటిఁ గా కంబుజాక్షి!
ఋషులపాశంబులే యింతలేసి పనులు?
కొంప కాఁబోతు నాఁబోతు గ్రమ్ములాడ
నడిమి లేఁబెయ్యగతి వచ్చె నాకు నిపుడు. 104

సీ. వివరించి చూడంగ విసుమానములుగాక
గోత్రారి వెఱచునే కుధరములకు?
యుగవిరామమున నుత్పాత లూఁపఁగఁజాలు
గాలి కొండ దమింపఁ జాల దెట్లు?
సర్వభూతంబుల శాసింపఁజాలెడు
జములావు గిరియందుఁ జడతవడునె?
దహనునిదాహకత్వంబు మహీధ్రసం
స్తంభంబునకు శక్తి చాల దొక్కొ?
తే. రుద్రు లాదిత్యతుషితమరుద్గణములు
దక్కఁగల దేవతలు జగత్త్రయము మ్రింగి
యుమియఁ జాలుదు రట్టివా రోపలేరె?
వింధ్యగిరిగర్వసంరంభవిభవ మడఁప. 105

తే. కామధేనువుఁ దనయింటఁ గట్టినాఁడు
గలవు తనతోఁటలోపలఁ గల్పతరులు

అట్టియింద్రుండు ప్రార్థించె నట్టె నన్ను
నింతపని కియ్యకోకుండ నెట్లు నేర్తు! 106

సీ. మాటనిల్కడఁ గాదె? మధుకైటభులు ద్రొల్లి
వారిచేతఁ జచ్చి రేకార్ణవమున
గరుడంపు మోమోటఁ గాదె? వాహన మయి
వనజాక్షు నెక్కించుకొనియె వీఁపు
స్వాగతంబునఁ గాదె? చక్రాయుధుఁ డడంపఁ
బాతాళబిలములో బలి యడంగె
విశ్వాసమునఁ గాదె వృత్రాసురేంద్రుండు
సమసె నంబుధివాక శక్రుచేత

తే. మెఱసి యుపకార మొనరింప మేలు వచ్చుఁ
గీడు వచ్చు మనంబులో నోడ వలదు
వాఁడు చేసినధర్మంబు వానిఁ గాంచుఁ
గీర్తి యొక్కటి సాలదే కేవలంబ! 107

చ. ప్రతిదివసంబు విందుము పురాణముఖంబునఁ గాశియందు సం
తతముగ నంతరాయములు దాఁకుచునుండు ననంగ నిప్పు డా
శ్రుతి నిజమయ్యె నే నిదె యశోకమనస్కత నుండఁగా నత
ర్కితగతివచ్చెఁ జూడుమి దెకిన్నరకంఠి! మహాంతరాయముల్.

తే. విముఖుఁ డయ్యెఁ జుమీ! నాకు విశ్వభర్త
గాక యూరక యేభంగిఁ గలుగ నేర్చు
సకలకైవల్యకల్యాణజన్మనిలయ
కాశికాక్షేత్రవిప్రయోగవ్యథార్తి. 109

తే. పాణియాహారకబళంబుఁ బాఱవైచి
కూర్పరము నాకు పిసవెట్టికూళ వోలె

సంతరవిముక్తతీర్థ మెయ్యదిరాఁ యనిన
వరణయును నసియును నైనవారణాసి. 114

వ. భ్రూఘ్రాణంబులసంధి యవిముక్తస్థానం బది యభ్యంతర తీర్థంబు తీర్థంబులు బాహ్యాభ్యంతరభేదంబున ద్వివిధంబులై యుండు. 115

తే. ఎల్లవియు బాహ్యతీర్థంబు లిందువదన!
యరయ బాహ్యంబు లయ్యు నాభ్యంతరములు
కాశికాతీర్థ మూాదిగాఁ గలవు కొన్ని
వాని వినిపింతుఁ బరిపాటి వనిత! వినుము. 116

సీ. శీర్షంబునందలి శ్రీశైలతీర్థంబు
మల్లికార్జునదేవుమనికిపట్టు
ఫాలభాగమునందుఁ బ్రాలేయమయ మైన
విమల కేదారతీర్థము వసించుఁ
గుచచూచుకములందుఁ గురుజాంగలమ్ముల
తీర్థరాజము సంప్రతిష్ఠ నొందు
భ్రూవిల్లరీయుగ్మమునకు మధ్యంబున
నానందవనతీర్థ మధివసించు
తే. నంతరంగమునఁ బ్రయోగ మాశ్రయించు
నిమ్మహాతీర్థములు పార్వతీశ్వరునకు
విహరణస్థానములు వేదవిశ్రుతములు
వెలుపలను లోపలను నుండుఁ దలిరుఁబోఁడి! 117

వ. బాహ్యాభ్యంతరంబులయందును నవిముక్తతీర్థం బుత్తమో త్తమంబు. అట్టితీర్థంబుననుండి యఖండంబు సచ్చిదానందైక

రసంబు నక్షీణీయంబు నగునిష్కళంకస్వరూపంబును నర్ధ
నారీశ్వరాదిరూపం బైనసకలస్వరూపంబును నగువిశ్వనా
థు నుపాసింప నొడఁగూడ దయ్యెం గావున నింక నేను భావ
తీర్థంబున యాభక్త నుపాసించెద. సంసారసాగరంబుఁ దరి
యింపసాధనం బగుటఁ దీర్థం బయ్యెఁ. అభ్యంతరంబైనయ
విముక్తతీర్థంబు బ్రహ్మవిష్ణుమహేశ్వరులకుపలబ్ధస్థానంబగుటం
త్రిమూర్తులకు సాధారణం బయ్యెనుమహేశ్వరునకుం బ్ర
ధానస్థానం బై యుండు. 118

సీ. ఏవిధంబున నాత్మ నెఱుఁగుదు నే నంచు
యాజ్ఞవల్క్యుని నత్రి యడిగెఁ దొల్లి
యవిముక్తునియం దుపాస్యుఁ డాత్మఁ డటంచు
యాజ్ఞవల్క్యుం డత్రి కానతిచ్చె
నాయవిముక్తమెం దాశ్రయించినది యం
చడిగెఁ గ్రమ్మఱ నత్రి యాజ్ఞవల్క్యు
నినుపారి వరణయందును నసియందును
నది యుండు నని యత్రి కానతిచ్చె
తే. యాజ్ఞవల్క్యుండు భ్రూమధ్య మాస్థలంబు
వరణ సంసారదోషనివారణంబు
నాశి యింద్రియదోషవినాశనంబుఁ
జేయుచుండుట యిట నిర్వచింపఁబడియె. 119

వ. అభ్యంతరావిముక్తక్షేత్రదర్శనంబు బ్రహ్మనాడీపవమాన
జయంబునం గాని సిద్ధింపదు. 120

సీ. ప్రకృతిరూపిణి యైనపాపపూఁబోఁడికి
మహదాదివికృతులు మలక లేదు

మొగము విచ్చి సుషుమ్న మూలరంధ్రముఁ గప్పి
పంశాస్థిసంబంధవలనలీల
నది మీఁదు ప్రాఁకి మధ్యమనాడితోఁ గూడి
ద్రుహిణరంధ్రముఁ గప్పఁ దోఁకచివరఁ
జక్కఁ జాయఁ జరింప నమకూరకుండుట
నిడఁ బింగళను గాలి యెక్కు డిగ్గఁ
తే. గెలనివాఁకిళ్లు రెండు వేగిరము మూసి
నడిమివాఁకిటఁ దెఱవ నెన్నంఁడు సేర్చు
సాధకుఁడు నాఁడుగాని వశ్యంబు గాదు
పవనవిజయంబు వానికిఁ బద్మనయన! 121

క. ఇడ వామనాడి పింగళ
కుడినాడి సుషుమ్న మధ్యగోచర యగు నీ
కుడియెడమ మధ్యనాడుల
కుడురాజానన! త్రిమూర్తు లొాగి దైవతముల్. 122

క. హరి యిడకు నలువ పింగళ
కరవిందదళాయతాక్షి! యమృతాంశుకళా
ధరుఁడు సుషుమ్నానాడికిఁ
బరిపాటి నధీశు లనుచుఁ బలుకుదు రార్యుల్. 123

వ. పవనంబునకు సుషుమ్నాప్రవేశలక్షణం బైన యోగంబు వివరించెద. బ్రహ్మలోకప్రాప్తిద్వారం బగుట సుషుమ్న బ్రహ్మనాడి యనం బరఁగు. షణ్ణవత్యంగుళప్రమాణం బైన దేహంబునట్టనడుమఁ ద్రికోణాకారం బై కుక్కుటాండంబు చందంబున నుండునది కందస్థానంబు. 124.

స్థితుం డగుపవనుండు యావత్కాలంబు నిడయందు సంక్ర
మించు నంతకాలం బుత్తరాయణం బీప్రకారంబున దక్షి
ణాయనంబు నెఱుంగునది. 129

చ. సమగతి నేకకాలమున సంగతి యాయువతీకళత్రుఁడం
గమలహితుండుప్రాణమునుగాడ్పులుదారటుకూడిపింగళా
ధమనిని డాసి తీవ్రగతిఁ దాఁకొని క్రుంకుమరస్తమింతు రే
సమయముఁనందుఁడాల్చునది చంద్రనిభాస్య! యమాభిధాన

తే. పాము కుండలి చంద్రుండు ప్రాణపవన [మున్.
మాసిరావల్లి యొప్ప దయ్యనిలుఁ క్రోలు
నది యశేషాంగకగ్రాస మైనయట్టి
గ్రహణకాలంబు సుమ్ము సారంగనయన! 131

వ. ప్రాణంబ యాదిత్యుండు. ఆదిత్యుండ చంద్రుండు. ఆప్రాణా
నిలంబు మూలాధారప్రవేశానంతరంబుదయించు మూర్ధ
ప్రవేశానంతరం బస్తమించు. దేవతలకు మొదలివిషువం
బైన మేషాయణంబున సూర్యుం డుదయించు. విషువాం
తరం బైన తులాయనంబున నస్తమించు. ప్రాణోదయాస్త
మయసమయంబులు విషువద్వయంబు. 132

చ. మొదలసుషుమ్నఁజొచ్చునిడముట్టినగాడ్పులకొంతసేపునం
బిదప సుషుమ్నఁబుట్టినసమీరము చొచ్చునిడాఖ్యనాడికన్
మొదలనుబిమ్మటంబవనముల్ దిరుగంబడి చొచ్చుఁ గానయ
య్యదనులుసంక్రమంబులనియాడుదురాగమతత్త్వకోవిదుల్.

వ. అని యవిముక్తక్షేత్రవియోగదుఃఖంబున మానసాంతర
విముక్తక్షేత్రమాహాత్మ్యం బుపన్యసించి యనంతరంబ

కాశికావిరహానలాభరంబు దుస్సహం బగుట నార్యశే
ఖరుండు కాశిని లక్ష్యంబు చేసి యిట్లనియె. 134

క. అనుదినము మాయను వా
గ్భ్రమాతిశయంబు విస్తరింపఁగ వశమే!
భూమండలతిలకము వర
భూమి కాశిని మెట్టు వాసి బోవుదుఁ గాశీ! 135

మ. నిజ మోఁ బల్కెడు బాహులెత్తి శ్రుతివాణీజాహ్నవీగోపతి
ధ్వజపీఠ ... ఈశ్వరుల్ గుఱిఁగ నోవారాణసీదేవి! యో
గజచర్మాంబరుహర్మ్యపట్టణమ! యోకల్యాణి! నీ బోలనం
బుజగర్భాండమునందు లేవు నగరంబుల్ తీర్థరాజంబులున్.

తే. లేవు లింగంబు లవిముక్తలింగమునకు
సాటిసేయంగ భూర్భువస్స్వస్త్రయమున
లేవు వక్కటిపుణ్యతీర్థములు నీకు
సాటిసేయంగ భూర్భువస్స్వస్త్రయమున. 137

వ. అని యొట్టుకేలకుం గదలి విరాళింగొన్నచందంబున మదులు
గుడిచినపోల్కి నపస్మారం బెత్తినపగిది నన్నుకొన్న విధంబున
దూపటిల్లినతెఱంగునఁ దూలపోయినరీతి విషం బెక్కిన
లీల బ్రాణంబు వెడలఁగ లాగిన లాహిరి పట్టినభాతి మదం
బెక్కినమాతంగంబు కుంగిడిగొన్న భంగి నూసరిల్లుచు సుస్సురనుచు
నిట్టూర్చుచు నుడిలగొనుచు నుపతాపం బందుచు
మాటాడుచు నూర్వశీనందనుం డూర్ధ్వబాహుండై యు
చ్చస్వనంబున. 138

సీ. పరమకల్యాణి! సౌభాగినవతీ! గంగ!
వార్థిగామిని! పోయివత్తు నమ్మ!

యమ రేంద్రులార! లోలార్క కేశవులార!
వనజసంభవ! పోయివత్తు నయ్య!
శ్రీవిశాలాక్షి! దాక్షిణ్యపుణ్యకటాక్ష!
వాసవార్చిత! పోయివత్తు నమ్మ!
శ్రీపూర్ణభద్రపారిషదనాయకులార!
వటుకభైరవ! పోయివత్తు నయ్య!
తే. తీర్థసంవాసులార! కృతార్థులార!
పాశుపతులార! భాగ్యసంపన్నులార!
మందిరోద్యానవాటికామఠములార!
పోయివచ్చెద మీకాశిపురను వెడలి? 139

సీ. కలహంసి! రారాదె కదలి నాతోఁ గూడి
నీ వేలవత్తమ్మ నెమ్మి నుండి
కదళీకాకాంతార! కదలి రా ననుఁ గూడి
నీవేల వత్తమ్మ నెమ్మి నుండి
శ్రీవిశాలాక్షి! విచ్చేయు నాతోఁ గూడి
నీవేల వత్తమ్మ నెమ్మి నుండి
నాతోడఁగూడి యంతగ్రహా! యేతెమ్ము
నీవేల వత్తమ్మ నెమ్మినుండి
తే. రండు ననుఁ గూడి యోపరివ్రాట్టులార!
వత్సలత గల్గి మీ రేల వత్తు రయ్య!
పరమనిర్భాగ్యుఁ డైననాపజ్జఁ బట్టి
కటకటా! సౌఖ్యజలరాశిఁ గాశిఁ బాసి. 140

వ. అని యిట్టకేలకుఁ గాశీనగరంబు వెడలి కొంతదవ్వు నడచి
కాశీవిప్రయోగతీవ్రవేదనాదూయమానమానసుం డై వద

నంబు నెట్టునట్లు నట్టి పాపంబులు గుదివడ నున్నానుచు నొక
నటునటుపెనీనదాబ్జబాధసంతాపవికలంబడి లోపాముద్ర కిట్లనియె.

తే. భూమిపతిపుత్త్రి ! చెప్పెదమా బుద్ధిమతివి
కాని చెప్పెలంగ నలనె నేకారణమునఁ
గారణము లేక యొనారించ కలుగు నెట్లు
సుఖము దుఃఖము గానక సుఖవిలీల ? 142

వ. రాత్రిందంబులయందుఁ బగుసుమం బనునది దేశాపేక్ష ; దివంబు
నందు పద్మవికాసంబు, రాత్రియందు యుత్పలవికాసంబు
ననునది కాలాపేక్ష; పుణ్యవంతునకు సుఖంబు, పాపిష్ఠునకు
దుఃఖంబు ననునది యదృష్టాపేక్ష; సర్వంబును నీశ్వరేచ్ఛా
యత్తం బనునది యీశ్వరాపేక్ష; విశ్వంబును గ్రహావశం
బనునది గ్రహాపేక్ష; మాయం జూడ నీశ్వరప్రేరణంబునం
గర్మంబు సుఖదుఃఖంబుల నాపాదించు; ఈశ్వరుం డెవ్వని
రక్షింపవలెనని వానిచేఁ బుణ్యకర్మంబులు చేయించు. నెవ్వ
నిం జెఱుపవలెనని వానిచేఁ బాపకర్మంబులు చేయించు అవి
ద్యాస్మితరాగద్వేషాభినివేశక్లేశపంచక మూలంబునఁ గదా
కర్మాతిశయంబు? అక్కర్మఫలం బిహలోకపరలోకంబులం
బ్రాణు లనుభవింతురు. కర్మంబునకు మూలభూతంబైన క్లేశ
పంచకం బెంతకాలం బనువర్తించునంతకాలంబునకుఁ ద్రివి
ధంబు పరిపాకంబు నానావిధయోనిజన్మప్రాప్తియు నాయువు
సుఖదుఃఖఫలోపభోగంబును జన్మంబునజన్మహేతుకర్మంబు
చరితార్థంబయ్యెనేనియు నవశిష్టంబులై యాయుర్హేతు
వులు భోగహేతువులు నైన కర్మంబులకు ఫలానురూపం
బైన భోగంబులు బరమేశ్వరుండు గల్పించుచుండు. 143

తే. ఏమి చెప్పఁగ నున్నది? యేవిధమునఁ
గాశి వెడలించుచున్నాఁడు కాలగళుఁడు
మనము లోఁగితి మేని లోఁగునె శివాజ్ఞ?
యుడుము నడికిన నడకునే బడియ పెట్టు? 144

వ. అని వెండియు. 145

సీ. వక్షస్థ్సలంబున వైచు మంత్రము చెప్పి
జమిలిపాములరాజుజన్నిదంబు
జడ లల్లి చొల్లియం బిడి యెక్కసకేముగా
బాలేందుశకలంబుఁ బదిలపఱచుఁ
గంఠమూలమునందుఁ గస్తూరిమాఱుగాఁ
గాలకూటవిషంబుఁ గీలుకొలుపుఁ
గటిభారమునయందుఁ గట్టు రింగులువాఱ
మెఱుఁగారు మువ్వన్నె మెకముతోలు

తే. గట్టువాలుపడంతి చక్కడముఁ దోఁపఁ
దఱచు గై సేయుచుండు నాతల్లి కాశి
యయిదు క్రోసులపొలములో నంత నంతఁ
జావు కుండంగఁ జచ్చినజంతువులకు. 146

చ. అని యెదురుండి మ్రొక్కి నయనాంబురుహంబుల బాష్ప
బిందువుల్, చినుకఁగ వెక్కివెక్కి కలశీసుతుఁడోయన నేడ్చు
నీరెలుం, గున నొకకొంత కొంత మఱి గ్రుమ్మరు మిన్నున
మ్రోవ నుద్ధుర, ధ్వనిఁ బఠియింపఁ జొచ్చెఁ బ్రణవంబునఁ
గూర్చినమంత్రరాజమున్. 147

వ. అచ్చోటు గదలి కతిపయప్రయాణంబుల వింధ్యాచలంబు
డాయం జనుదెంచి విషమదృషత్ ఖండవిలసనస్థలంబును

జరత్తరక్షుకోటరజఠరజ్వలితదవజగరగళ గుహానిష్ఠ్యూతనిష్ఠురవ
వనాంధుధూమధ్వజదహనశిఖాకలాపంబును నుగ్రతరశరభ
పటులచపేటపాతమోహితరోహితంబును సముద్ధతస్తబ్ధరోమ
కంఠకఠోరఘుర్ఘురధ్వానఘుమఘు మా య మానదిక్కుంజర
క్రోడంబును క్రీడచ్ఛిక్రోడశిశుచరణనఖశిఖాశిఖరవిశీర్య
మాణశిఖరశేఫాలికాకుసుమకేసరరజః ప్రసరధూసరవాసర
కరకర వ్రాతంబును బహుపతత్పవనబిలపతితపచేళిమదధిఫల
ఫలాస్వాదగర్వ భల్లూకప్రకరంబును నగుమహాగహన
మధ్యంబున. 148

సీ. యక్షరాజుఁ దలంచి యక్షిగోత్రంబుల
నశ్రుపూరము నించు నర్మి మిగిలి
పలుమాఱు నట దండపాణిసౌహార్దంబు
భావించి భావించి పలవరించు
సంభ్రమోద్భ్రముల విశ్వాసపాత్రంబుల
సౌవిదల్లుల నర్థి సంస్మరించు
డిగ్గజాఘోరసిద్ధివినాయకకపర్ది
చింతామణిగణేశులఁ బొగడు

తే. జ్యేష్ఠసౌభాగ్యసుందరీచిత్రకంఠ
వికటదుర్గామహాదేవి విశ్వవాహ
ఘాటికాదేవతల నిజస్వాంతవీథిఁ
గాంచి గలువ్రాల్పు పర్యాంకకములఁ దపసి. 149

క. త్రిణయనునిరాణివాసము
నణిమాద్యైశ్వర్యవితరణామరతరువుఁ

మణికర్ణిక ముక్తివధూ
మణికర్ణికఁ దలఁచుఁ దపసి మానసపీథిన్. 150

సీ. కఠవల్లిఁ బఠియించుఁ గఠము సంశోధించుఁ
బ్రాణోపనిషదభిప్రాయ మరయుఁ
బరిపాఁడ ముండకోపనిషత్తుఁ దాపనీ
యోపనిషత్తు నభ్యుపగమించు
దఱియు నథర్వవేదశిరగ్రపంచంబు
లారణ్యకము త్రోవ లరసి చూచుఁ
బ్రశ్నోపనిషదర్థపరిమళంబు గ్రహించు
శ్రీభగవద్గీతఁ జిత్తగించుఁ
తే. దల వకారంబు శ్వేతాశ్వతరము ననెడు
నుపనిషత్తులు దలపోయు నొయ్య నొయ్యఁ
గాశికాక్షేత్రవిప్రయోగప్రభూత
హృదయసంతాపశాంతికై యిల్వలారి. 151

వ. అప్పుడు. 152

మ. క్షితిపాలోత్తమవంశభూషణము లక్ష్మీభారతీపార్వతీ
ప్రతిబింబంబు సమగ్రకాంతిమతి లోపాముద్ర నీక్షించి య
ద్భుతముంబొందుచువింధ్యనామకమహాభూమీధరారణ్యదే
వత లందంద నమస్కరింతురుమనోవాత్సల్య మొప్పారఁగన్.

మ. నలి వింధ్యాచలకాననాంతరమున న్వారాణసీత్యాగవి
హ్వలభావంబున నిల్చి నిల్చి హర! నీహారాంశుమూర్ధన్య! ని
ర్మల! కాశీశ్వర! నీలకంఠ! యనుచున్నమ్రాన్గన్ను వాటిల్లఁద
త్కలశీసూనుఁడుమూర్ఛఁగై కొనుసమగ్రంబైనతద్వేదనన్.

వ. వెండియుఁ గుంభసంభవుండు. 155

చ. దురితము లెన్ని చేసితినొ తొల్లిటిజన్మమునందుఁ గాశికా
పురమున సర్వజంతువులు భూరివిముక్తులు గొల్లలాడఁగా
హాహా! నెత్తిఁ జేతు లిడి యశ్రులు గన్నుల నొల్క నిప్పుడే
గటనిఘటనాసహిష్ణు నిటు ప్రాకారమిషమ్ములు వస్తచోటికిన్.

తే. ఏల ప్రాంతి నాకాశి నిల్వలు? నిల
నేల ప్రాంచితి డిడారంది మోలి సహంషు?
నాశ్రయాయంబు నాదె న న్నిరిపాటు
కాదె వాసలంగఁ దోఁచె నిష్కారణంబ. 157

సీ. ఎన్నఁడు చూతునో యింకొక్కమా రేను
బ్రకటకైవల్యంబురాశిఁ గాశి?
నెన్నఁడు చూతునో యింకొక్కమా రేను
జగదేకపావని జహ్నుకన్య?
నెన్నఁడు చూతునో యింకొక్కమా రేను
మహిమాస్పదము ముక్తిమంటపంబు?
నెన్నఁడు చూతునో యింకొక్కమా రేను
విశ్వలోకారాధ్యు విశ్వనాథు?

తే. నింక నెన్నఁడు చూతునో యేను డుంఠి?
నింక నెన్నఁడు చూతునో యేను దుర్గ?
నింక నెన్నఁడు చూతునో యేను వటుకు?
నింక నెన్నఁడు చూతునో యేను గుహుని? 158

{ అగస్త్యుండు లోపాముద్రతోఁ గాశిఁ బెడబాయుట
వింధ్యగర్వాపహారణము }

వ. అనుచు నల్లి గ్గన కుంభసంభవు దప్పుదప్పులం గాంచి
కాంచనశిరశ్శృంగశృంగాటకంబులం గమలభవాండకటా

హంబు లుప్పొంగించుచుతనమేటిపొడవు నేలసపాటంబుగా నంచి వింధ్యాచలంబస్మహానుభావు నెదుర్కొనియె. అప్పు డర్కునిరథంబుచక్కఁ జాయ నడచె. పవనస్కంధంబులు నిర్బంధంబు లుడిగె. ఇందుండు చిందిలిపడసాగె. మంగళబుధ బృహస్పతిశుక్రశనైశ్చరరాహుకేతువులు దమతమతాన కంబులు దప్పకచరింపం దొడఁగిరి. విశ్వప్రపంచంబుసర్వంబును క్రమంబున యథాపూర్వంబునం బ్రవర్తిల్లె. కాలంబు లేర్ప డియె. అనంతరంబ పురుషాకారంబు దాల్చి యజ్జగతీధరంబు గొన్ని యంజలం బ్రత్యుద్గమించి. 159

సీ. ప్రణవపంచాక్షరోపనిషత్ప్రపంచంబుఁ
గడదాఁక నెఱిఁగినకఱతలాని
వాతాపిదైత్యు నిల్వలునితోఁ గూడంగ
జఠరాగ్ని వేల్చినసవనకర్తఁ
గోపించి నహుషునిఁ గుంభీనసంబుగా
హుంకార మిచ్చినయుగ్రతేజు
వానకాలమునాఁడు వండుపట్టినసీటి
కాలుష్య ముడిపెడుకతకఫలముఁ
తే. బాండుభసితత్రిపుండ్రాంకఫాలభాగు
భద్రరుద్రాక్షమాలికాభరితవక్షు
భార్యయును దాను నేతెంచుపరమశైవుఁ
గాంచె వింధ్యాచలేంద్రంబు కలశభవుని. 160

క. కాశీనగరీవిరహ
క్లేశభవక్రోధవహ్నికీలల నాశా

కాశధరిత్రీవలయము
లాశుగతిం గాల్వఁ గడఁగునట్టిమహోగ్రున్. 161

వ. కాంచి యక్కుంభిసీధరంబు కుంభసంభవు నతిథిసత్కార సంభావనావిశేషంబులం బరితోషంబు సంపాదించి కరాంభోరుహంబులు మోడ్చి 'మహానుభావా! నీయాజ్ఞాప్రసాదభాజనంబుఁ నను గృతార్థుం జేయు' మని పలికిన. 162

సీ. వింధ్యాచలేంద్ర ! పృథ్వీభృత్కులశ్రేష్ఠ!
దక్షిణాపథముతీర్థంబు లాడఁ
బోవుచున్నాఁడ నీవుర్విఁబోఁడియు నేను
బెద్దకాలమునాఁటి పెరిచ గాన
లావు చాలదు జరాక్లైబ్యంబుఁ తమునఁ
బోడ వెక్కనపుడు డిగ్గెడునపుడును
నభ్రంకషము లైనయానీశిరశ్శృంగ
శృంగాటకము లిట్లు చిఱుతపఱచి
తే. యనఘ ! నేఁ గ్రమ్మఱఁగ వచ్చునంతదాఁక
నుండవలయు ధరిత్రిలో నొదిఁగి నీవు
చేయు నాయాజ్ఞ లెస్స యట్లఁ జేయకున్న
నెఱిఁగెదవు గాక రజ్జాడ నేల యిపుడు? 163

వ. అనిన వింధ్యంబు మహాత్మా! చరాచరంబైనజగంబునందు నీయాజ్ఞఁ జేయనివారునుం గలరె? నీవు మరలి విచ్చేయునంతదాఁకను నిట్లు యుండెద ననినఁ గుంభసంభవుం డతని దీవించి నిజపాదాంభోరుహవిన్యాసంబుల విశ్వవిశ్వంభరాభాగంబు భాగ్యవంతంబు గావించుచు దక్షిణదిశాభిముఖుం

డయి చనిరి యని చెప్పిననైమిశారణ్యవాసు లటమీఁది
వృత్తాంతం బెయ్యది యనుటయు. 164

ఆశ్వాసాంతము

ఉ. బలవద్బాహరహాగొంతిమన్నెధరణీపాలావరోధాంగనా
విలసన్మంగళసూత్రరక్షణకళావిఖ్యాతకారుణ్య ! యు
త్కలకర్ణాటతురుష్కరాట్పరమమిత్రా! కుండలిస్వామికుం
డలపూజాపరతంత్రధీవిభవ! పంటక్ష్మాపచూడామణీ! 165

క. భూపాలమథన ! జంబూ
ద్వీపేశ్వర ! విమతరాయవేశ్యావిటథా
టీపటహాడాన్నినాదా
టోపప్రక్షుభితదిక్కుడుంగక్రోడా! 166

ఉత్సాహ—

బంధులోకపారిజాత! పంటవంశపావనా!
సంధివిగ్రహప్రధానషడ్గుణా! విశారదా!
గంధవాహభుక్కలాపకంఠకోణనాభిని
ర్గ్రంధనక్రియామహాప్రగల్భకీర్తివైభవా! 167

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర
సుకవిజనవిధేయ కవిసార్వభౌమ శ్రీనాథనామధేయప్రణీ
తంబైన కాశీఖండం బనుమహాకావ్యంబునందు ద్వితీయా
శ్వాసము.

# తృతీయాశ్వాసము



మత్సైపటీరంశ
గ్రామణి! మూర్ధాభిషిక్తకంఠీరవ! సు
త్రామనిభవైభవోన్నత!
ధామాపాంచాల! వీరభద్రనృపాలా! 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. 2

ఉ. ఆపృథివీధరంబు హృదయంబున సంతస మందె నెంత
యుం, గోపముఁ జెల్లకాలమును గుంభభవుం డతఁ డిప్పుడు
గ్రుంకై, శాపవిప్రయోగమునఁ జావఁ దలంచిన నడ్డ
మెవ్వ ర, ష్టాపదశైల మిప్పటికి శంక వహింపకయుండుఁ
గాపతన్. 3

వ. అని కుంభసంభవుని ప్రత్యాగమనంబుఁ గోరుచు వింధ్యా
చలంబు వంధ్యోద్యమం బై వసుంధరాగర్భంబున నడంగి
యుండె. 4

తే. ముని జటాధారి శివభక్తుఁ డనఘమూర్తి
యెవ్వఁ డేతెంచు నప్పు డత్తెత్తిచూచుఁ
గుంభసంభవుఁ డనుకోర్కి కొనలుసాఁగ
వసుమతీధర మతఁ డేల వచ్చు మరలి! 5

తే. మొదలగల పెన్కు సముద్రముఁబోయి మునిఁగె నద్రి
కలశజనినేత్రములఁ గెంపు గాన నైన
నొరుని నైశ్వర్య మీక్షించి యుపతపించు
నట్టిఖలునకు నిది పెద్ద యానె? తలఁప. 6

క. సిద్ధింప వీప్సితంబులు
సిద్ధించెన యేనిఁ బిదపఁ జెడు నన్యునిసం
పృద్ధిఁ గనుంగొని యెవ్వని
బుద్ధి నసూయాగ్రహంబు బొందు నతనికిన్. 7

తే. అప్రయోజన మభివృద్ధి నతిశయిల్లు
నప్రయోజన మడఁగుఁ గాలాంతరమున
నకట! యీర్ష్యాగ్రహగ్రస్తుఁ డైనయట్టి
ఖలునిసంపద విధవచన్నులను బోలె. 8

వ. ఆసమయంబునం బాకశాసనపావకపరేతరాజపలలాశిపాశి
పవనపౌలస్త్యపశుపతులు పరమహర్షోత్కర్షంబున నగస్త్య
మహర్షిం బ్రస్తుతించిరి. పతంగుండు బసిండికొండనెత్తంబు
చక్కటివియత్తలంబున నడవం దొడంగె. 9

సీ. స్ఫటికభూములయందుఁ బ్రతిబింబములు చూచి
యితరాశ్వబుద్ధి హేషిత మొనర్చుఁ
బద్మరాగోపలప్రస్థభాగములందుఁ
జరమసంధ్యాశంక జాడ్య మందు
మరకతమణిశిలామధ్యంబునందు దృ
శ్యాదృశ్యమూర్తులై యలరుచుండు
వైడూర్యమాణిక్యవప్రాంతరములందు
సలిలాభిలాష నౌదలలు వాంచుఁ

తే. బసిఁడిగిలుకలచెరుకోలఁ బరిఢవించి
కఠినహుంకార మొనరించి కనకరథము
వారువంబులఁ బఱపె దుర్వారలీల
బిరుసు తహతహ వినువీథిఁ బిచ్చుకుంటు. 12

అగస్త్యుండు దక్షిణకాశికిం బోవుట.

వ. ఇవ్విధంబునం భువనోపద్రవంబుఁ బ్రశాంతిం బొందించి దక్షిణకాశీసందర్శనంబునం గాని కాశీవియోగవేదనాభారంబు డిందుపడ దని డెందంబున నిశ్చయించి మందమంద ప్రయాణంబులఁ గొందలికాకుఁబోఁడియాకులతం బొందిగసు గందకుండ ముందఱ నిఱింది నడపించుచు నెడనెడఁ బుణ్యవాహినీతీర్థంబులఁ గ్రుంకులువెట్టి యష్టమూర్తి నభ్యర్చించుచుం గొన్ని వాసరంబులకుఁ గుంభసంభవుండు గోదావరి నోరసి కొనుచు నాంధ్రదేశంబున నరుగునప్పుడు. 13

మ. అహారారంభములందుఁ బ్రస్రవణశైలాధిత్యకాకందరా
కుహరక్రోడకటాహగద్గదనదద్గోదావరీసింధువా
ర్లహరీశీకరమాలికాశిశిరము ల్పంపాసరుల్ దండకా
గహనగ్రాములువాయువుల్ దపసికిం గావించె నాహ్లాదమున్.

తే. ఋషికిఁ బంపాసరోవీచిపృషతశిశిర
గంధవాహప్రవాహసంబంధములును
గాశికాక్షేత్రవిప్రయోగప్రభూత
తాపశాంతి యొనర్పంగ నోప వయ్యె. 15

సీ. పట్టుగా శ్రీవీరభద్రేశు సేవించి
యిలసోమనాథునంఘ్రిలకు నెరఁగి
పురశాసను ననంతభోగీశ్వరస్వామి

[illegible]శైలస్థకాశీశుఁ గొల్చి
[illegible] శ్రీపాదంబు లర్చించి
[illegible] మార్కండేయు భజించి
[illegible]కుండలాముఖముల
[illegible] మహాపాతకుఁ దలఁచి

తే. [illegible]మున ఘోరభక్తి నిలిపి
[illegible]మున [illegible] గంగలోఁ గ్రుంకువెట్టి
[illegible] సప్తగోదావరమున
మునిఁగి భీమేశ్వరుఁ గాంచె మునివరుండు. 16

శా. ప్రాతఃకాలము తీవ్రభానుఁ డుదయింపన్ సప్తగోదావరీ
స్రోతఃపూరమున న్మునింగియథవృత్ సోమార్ధచూడామణిన్
జ్యోతిర్లింగము యస్వరూపుఁ గొలిచెన్ శుద్ధాంతరంగంబునన్
జాతిప్రత్యయమహాప్ర[illegible]నిధి లోపాముద్ర భీమేశ్వరున్. 17

మ. మునిచూడామణి యొల్లసత్కళలకున్ మూర్ధాభిషిక్తుండుగా
పువఁ జారికరంగహారముల తావుల్ మించి కీర్తించుచున్
శనివారోత్సవవేళఁ గన్గొనియె నాస్థానంబునన్ రాజనం
దనయుం దానుసు వేశిమార్గమునగంధర్వాప్సరోనృత్తముల్.

వ. అంత. 19

తే. కుంభజుఁడు దక్షిణాభిముఖుం డగుటయు
నదను వీక్షించి వచ్చె నో యనఁగ వచ్చె
శంబరారిప్రతాపాగ్నిసామిధేని
నవశరద్వేళ శ్రీభీమునాథుఁ గొలువ. 20

తే. జిగురుకొన్న రజస్స్వాప్తిఁ జెఱఁగుమాసి
జలజకుండోదకంబుల జలకమాడి

మలయజాచ్ఛపయోధరమండల లగు
దిగ్వధువులందు రుచిఁ బ్రవర్తించె నినుఁడు. 21

సీ. అభినవోన్మేషజం బైనట్టితొలుమాపు
కౌస్తుభాలోకరేఖలకు నలఁగ
సాంగభంగం బైనయాపులింతకు వేల్పు
లంగుటిస్ఫోటనం బాచరింప
సౌఖశాయనికు లై సంవర్తభృగ్వాది
మునులు హస్తాంభోజములు మొగుడ్ప
ధృతచేతనంబు లై దివ్యాయుధంబులు
జయజయధ్వనులతో సంస్తుతింప

తే. నలువ ఱేకులు బేలెపెంజిలువ ఱేని
యరవికుబుసంపుఁబొరలు మై నంటియుండ
నిదుర మేల్కాంచి కూర్చుండె సుదధినడుమ
విష్ణుఁ డఖిలేశ్వరుఁడు శరద్వేళయందు. 22

వ. వెండియుఁ బాకదశావిశీర్ణదిశాశాల్మలీగుల్మతూలరాశిదేశీయంబులు వియదురగనిర్మోకశకలవిభ్రమంబులు నభ్రముపతిశరీరశుభ్రంబులు నగుసితాభ్రంబు లభ్రంబునం బరిభ్రమించి ఖండఖండంబు లై యాఖండలకోదండదండంబుల గగనమండలంబున నలంకరించె కోదమమొగుళ్లు దెరలును దడంబడఁబడు వలుఁదవడగండ్లు పుష్పాంజలులును నుఱుముచప్పుళ్లు మర్దళ ధ్వనులుగా గగనరంగస్థలంబునం గ్రొమ్మెఱుంగు మెఱుంగుఁబోఁడి గొండ్లి పరిఢవించె మత్తవనమయూరమత్తకాశిని (స) కలహంస మధు (ర) కంఠ కేకాగీతికావసానంబునం గళాపించె. కుంభద్రోణంబు లంభోధరంబులు గురిసి వెలిచిన

యనంతరంబ యంతంత సుట్టికడు నట్టిసలిలబిందువులన రజనీ తరుణీముక్తాఫలంబులు నక్షత్రంబు లంతరితంబున సంప్రేక్షణీ యంబులయ్యె. దాక్షారామకటకాప్సరస్తాటంకినీవదనారవింద లావణ్యవిస్పందంబు చందురుండు కందర్పదిగ్విజయకీర్తి స్ఫూర్తిరూపంబోని యచ్చవెన్నెల విచ్చలవిడిం గాయం దొడంగె. కుముదంబులు ముదం బందె, లాంగలి చెంగలించె, ఉల్లిపిల్లి, కాసర గాచె, దోస దోరగిలంబారె, పయ్యెద విసరె, వాడిమందటిలియె, కరి మదంబుం గురిసె, నందిపోతు పోతరించి ఖణిల్లున ఱంకె వైచె, అసలదుగువడియె, నెఱిని నిసుక దెస దీవి చూపె, నీడ సవియయ్యె, ఏడాకులపొన్న క్రొన్నన పెరిఁగె, వరిగ విరిగె, గసగసు యెసక మెసఁగె, పెస రుసురు కొనియె, తవిద పొదలె, తెక్కప్రాసంగు దొండముక్క వడియె, మదకలకలహంససంపదసల్లాపకోలాహలవ్యాజృం భకరంభితకకుబంతంబు లై (న) విహారవేళంతంబులు గాంతా కుచద్వయ ద్వయస వాఃపూరవంతంబు లయ్యె నయ్యవసరంబున.

తే. కార్తికపువేళ భీమశంకరునినగర
వింధ్యసంస్తంభయిత దూరె విమలబుద్ధిఁ
దొయ్యలియుఁ దాను జిచ్చుటతోరణంబు
కలుషసంహాతిసంహారకారణంబు. 24

క. దక్షిణవారాణసి యగు
దాక్షారామంబు సొచ్చి తీరుణేందుధరుఁ
వీక్షించినకోలెను గా
శీక్షేత్రాలోకసుఖమ చేకుతె మునికిన్. 25

క. క్లేశంబును సౌఖ్యంబును
నాశువునను గుంభజస్ముఁ డభిమర్శించెం
గాశీవిరహము దక్షిణ
కాశీసంగమము వరుసఁ గలిగినకతనన్.

వ. పరోపకారపరుండయినవానికిఁ బుంఖానుపుంఖంబు సంపదలు సంభవించు. తీర్థస్నానదానజపహోమదేవతార్చనాదులు పరోపకారంబునుంబోలనేరవు. పరాపకారంబునకంటెనధర్మంబు లేదు. లోకోపకారపరాయణుం డైనవాతాపిదమను కింతవింతలేసి ప్రయోజనంబులు సమకూఱకుండునె? ఇవ్విధంబున భోగమోక్షనివాసంబైన దాక్షారామంబునం గొన్ని దివసంబు లుండి కొల్లాపురంబునకు శ్రీమహాలక్ష్మి దర్శింపం (బోఁ) దలంచియమ్మైత్రావరుణుండు. 27

{ అగస్త్యుండు కొల్లాపురంబున కేఁగుచు మార్గమున వీరభద్రేశ్వరు దర్శించుట. }

సీ. అంతరప్రవాహమై యావిర్భవించె నే
ధరణీధరముపొంతఁ దల్యభాగ
పాటె నేశైలంబుపాదమూలంబునఁ
గల్లేటితో వృద్ధగంగ వాసి
యుదయించె నేకొండయుత్తరాకారసా
తలకుక్షి సప్తగోదావరంబు
జనియించె నేశిలోచ్చయము దక్షిణమున(ఁ)
గణ్వవాహిని యుప్పుఁగడలికొమ్మ
తే. భర్మగిరితోడఁ బుట్టు వేపర్వతంబు
బలసియుండు నేయద్రికిఁ బంచలింగ

మట్టి శ్రీవీరభద్రమహాబలమున
కనుగొంటివె వింధ్యగర్వాపహారి. 28

వ. అని శ్లాఘించి లోపాముద్ర కిట్లనియె. 29

తే. దక్షిణానందవిపినమధ్యంబునందు
క్రతువిధ్వంసవేళఁ దేవతల నురిపె (సె) (పి)
వీరభద్రేశుఁ డీయద్రి వెలసెఁ దన్ని
గౌతమీవారిఁ దనపాలు గడిగినాఁడు. 30

తే. పంకజాస్త్రాధరము వీరభద్రగిరియు
నంధ్రభూమికి వక్షోజహద్వయంబు
భువనచక్షుఃకరండ మంభోరుహాక్షి!
గౌతమీగంగ ముక్తావలకంఠమాల. 31

సీ. ఎవ్వాఁడు డాచేత క్రొవ్వాఁడినఖములఁ?
జివుమె భాషాదేవిచిగురుముక్కుఁ
గనకమేఖలఁ గ్రుచ్చి కట్టె నెవ్వాఁడు లీలఁ
జెలఁగుపైఁ బూపార్క మెఱుఁగుపండ్లు
కొసర కెవ్వాఁడు పదాంగుష్ఠభాగంబున
నుదు రాజపోష్టిగోఁజాలుకనూఁదెఁ
దలఁగ నెవ్వాఁడు ఖడ్గభారాంచలంబున
నగ్నినాలుక లేపు నంటుమవఁజిమి

తే. మోఁదె నెవ్వాఁడు ముష్టిమూఁడుకోట్ల
వేలుపులఁ బారఁ బార వెన్నంటఁ దఱిమి
యట్టి శ్రీవీరభద్రుఁ డీయద్రిమీఁద
భద్రకాళియుఁ దాను దాఁ బట్టనయున! 32

తే. బ్రహ్మసంవేద్య మాదిగాఁ బట్టె సాంత
మతిన! గోదావరీనదీహారమునకు
నడుమ నాయకరత్న మై నలువు మిగులుఁ
బంచలింగాశ్రయము వీరభద్రశిఖరి. 33

వ. అని చెప్పి యచ్చోటు గదలి ప్రతిదినప్రయాణంబుల. 34

క. శ్రీరారామంబునఁ బ్రా
చ్యారామంబునను నాదిమారామమునం
దారాధిపచూడామణి
నారాధించెను మునీంద్రుఁ డతివయుఁ దానున్. 35

వ. అనంతరంబయమ్మునిసింహంబు సహ్యగిరికన్యకా ప్రవాహం
బునఁ గృతావగాహుం డయి కదలి పశ్చిమాంభోధితీరం
బున సౌరాష్ట్రసోమనాథేశ్వరశరచ్చంద్రచంద్రికాధౌతకల
ధౌతసౌధవీథికాసముల్లిఖితగగనమండలం బయి పదునెని
మిదియోగపీఠంబులందును సుప్రసిద్ధం బైనకొల్లాపురంబు
నకుం జని యందు. 36

ఉ. శ్వేతవరాహకల్పమున వెన్నుఁడు సూకరవేషధారి యై
యాతతదంష్ట్రికాంకురమునందు ధరిత్రి వహించియుండఁగా
నాతనిమీఁద లేఁతపాలయల్క వహించి తొలంగి వచ్చెనో
యీతరలాక్షి? యంద్రు బుధు లెప్పుడు నాజగదేకమాతృకన్.

తే. భద్రకాళికయై ఘోరపరశుధారఁ
గ్రూరదైత్యునిఁ బొరిగొన్న ఘోరమూర్తి
శౌరివక్షస్థ్సలీనభశ్చంద్రరేఖ
శ్రీమహాలక్ష్మి భక్తి వీక్షించెఁ దపసి. 38

క. కొల్లాపురిలక్ష్మికిఁ బ్రణ
మిల్లితి పులకాంకురములు మేనులఁ బొడమన్
వ్రాల్లెఖామంత్రోపని
షల్లతికాకుసుమకుసుమసకు సతియుం బతియున్. 39

వ. అనంతరంబ సంభసంభవుం డాత్మగతంబున. 40

ఆగస్త్యుండు లక్ష్మిని స్తోత్రముచేయుట

సీ. శ్రీదేవతకసయ్యకు శ్రీమహాలక్ష్మికిఁ
గమలాయతాక్షికిఁ గంబుకంఠి
కఖిలలోకేశ్వరి కామ్నాయవినుతకుఁ
గనకకైతకపుష్పగర్భగౌరి
కరుణార్ధదృష్టికి నమరకోటికిరీట
కోటివిటంకసంఘాటఘటిత
రత్నాంకురప్రభారాజి నీరాజిత
శ్రీపాదపద్మపీఠోపకంఠ

తే. కంబురమానాథుదేవికి నాదిశక్తి
కిందిరకు లోకమాతకు నిగురుఁబోఁడి
కలరువిల్కానితల్లికి నాత్రితార్థ
కల్పవల్లికి మ్రొక్కెదఁ గంటి మంటి. 41

వ. అని అనంతరంబ. 42

తే. చంద్రమునియందు జ్యోత్స్నవు చంద్రవదన!
ప్రభవు వాసరకరునందుఁ బద్మనయన!
దాహశక్తివి పూఁబోఁడి! దహనునందు
మ్రొక్కెదను నీకుఁ గల్యాణమూర్తి! లక్ష్మి! 43

తే. బ్రహ్మ పుట్టించు మనుచు నారాయణుండు
హరుఁడు హరియించు భువనంబు లవసరమున
నెందు సమకూఱు వీరికి నీప్రభావ
మీవు గలుగంగఁ బట్టి కా కిందువదన! 44

ఉ. పండితుఁ డాతఁ డాతఁడు ప్రభావసమగ్రుఁ డతండు శూరుఁ డా
తండు వివేకి యాతఁడు వదాన్యుఁ డతండు మహాకులీనుఁ డా
తండు కళావిధుం డతఁడు ధన్యుఁ డతండు మనోజ్ఞమూర్తి యె
వ్వండు భవత్కృపాకలన వైభవలక్ష్మికిఁ బాత్రుఁ డిందిరా!. 45

చ. పురుషునియందు భాగ్యమును బోల్తుకయందు విలాసరేఖయుం
గరిహయులందుఁ బక్షిభుజగంబులయందు మహీరుహావళీ
హరితతృణంబులందుఁ బసులందును బెయ్యలయందుఁ గుక్క
లం, దరుదగు బెంపునొప్పు భవదంశముగా దెతలంప నిందిరా!

ఉ. *ఎవ్వని నేని నీవు దయ నించుకఁ జూచిన వానిఁ జాతు ర
ప్సాస్త్రీలు కానిఁగా సతులు భూపతిఁగాఁ బ్రజ కల్పకంబుగాఁ
నవ్విబుధాశ్రితవ్రతతి యంబుధిఁగాఁ గులగోత్రగోత్రముల్
కవ్వడిఁ గాఁ బరద్వేషులు గష్ణునిఁగాఁ గవు లెల్ల శ్రీసతీ!

ఆ. కమలనయన! నీవు కలచోటు సరసంబు
నీవు లేనిచోటు నీరసంబు
కంబుకంఠి! నీవు కలవాఁడు గలవాఁడు
లేనివాఁడు నీవు లేనివాఁడు. 47

సీ. పరిపూర్ణ హేమకుంభములు హస్తంబుల
ధరియించి యిరువంకఁ గరులు గొలువఁ

---

* ఈపద్యము మద్రాస్ ఓరియంటలులైబ్రరిలో నుండు నొక తాళపత్ర ప్రతిలోమాత్ర మున్నది. ఇతరము లగు పెక్కుప్రతులయందుఁ గన్పట్టదు.

బహుళన్నై పరశంఖపద్మమహాపద్మ
మకరాదినిధులు నేమమునఁ గొలువఁ
వింజామరలు వాల్చి వెనుకదిక్కున దేవ
గంధర్వగుహ్యకాంగనలు గొలువ
నెలవంక బలువంక నింద్రాదిదివిజులు
సేవాంజలులు నొసళ్ళఁ జేర్చి కొలువ

తే. భర్మసంకజకర్ణికాభద్రపీఠి
కాగ్రమున నిండుకొలువుండి యఖిలలోక
రక్షణము సేయు నిన్నేను బ్రస్తుతింతు
పరమసౌభాగ్యగుణధన్య! యద్రికన్య!. 48

వ. పరమార్థవస్తువిభాగంబు సేయవచ్చిన శక్తిమంతుం డైన యీశ్వరునకు శక్తి యగునీకు భేదంబు లేదు, గావున శక్తుం డగు నీశ్వరునకుం గలసృష్టిస్థితిసంహృతి స్వభావస్వరూపంబులై నకృత్యంబు లైదును నీయవి. దహనునకు దాహశక్తియు, నుష్ణాంశునకు దీధితియుఁ, జంద్రునకుఁ జంద్రికయుంబోలె నీశ్వరునకు నీవు సహజవు ధ్రువవు నై యుండుదు. ఇహజన్మజన్మాంతరంబుల విహితంబులైన వ్రత దానాదులచేతసంచితంబులై నదురితంబులు నిరసింపఁబడుటం జేసి యస్తరజస్తము లైనయుత్తములు విశుద్ధసత్త్వులయి నీతత్త్వంబుఁ జింతింతురు. భోగాపవర్గలక్షణం బైనఫలంబు పరమేశ్వరుండు పశుగణంబున కిచ్చునపుడు నిన్ను ముస్నిడి కొనికాని యీఁజాలండు. శబ్దబ్రహ్మంబు కారణబిందాత్మకంబై బిందునిష్యందత్వంబున (కుం)బురుషచ్ఛాయాప్రయత్నంబున మూలాధారావస్థితపవనసంధుక్షణంబునం జేసి

యభివ్యక్తంబై పరావాక్కనంబడు. ఆబ్రహ్మాం బీనాభిపర్యంతం బౌవాయువుచేత నభివ్యజ్యమానంబై విమర్శరూపంబైన మనంబుతోడంగూడి సామాన్యస్పందప్రకాశరూపిణియుఁ గార్యబిందుతత్త్వాత్మకయు నీశ్వరాధిదేవతయు నై పశ్యంతీ వాక్కనంబడు. ఆబ్రహ్మాం బౌవాయువుచేతన హృదయపర్యంతం బభివ్యజ్యమానంబై నిశ్చయాత్మకబుద్ధియుక్తంబై విశేషస్పందస్వరూపయునాదబిందుమయయుహిరణ్యగర్భాధిదేవతయునై మధ్యమవాక్కనంబడు. ఆబ్రహ్మాం బాస్యపర్యంతం బౌవాయువుచేతన కంఠాదిస్థానంబులయం దభివ్యజ్యమానంబై యకారాదిక్షకారాంతవర్ణమాలారూపంబై (నిశ్చయాత్మమై) శ్రోత్రగ్రహణయోగ్యంబై వైఖరీ వాక్కనంబడు. ఈచతుర్విధసూక్ష్మస్థూలమాతృకాస్వరూప విట్టి (దేవీ!) నీకు నమస్కారంబు. 49

తే. అని నుతించినఁ బ్రియ మంది యబ్ధికన్య
కలశజునిఁ జూచి యి ట్లను గారవమున
ననఘ! నీస్తోత్రమునకు నాయాత్మ మెచ్చె
నీవు గోరినవర మిత్తు నెమ్మిఁ గొనుము. 50

వ. ఇంక రాఁగలయిరువైతొమ్మిదవద్వాపరంబున నీవు వ్యాసుండవై వారణాశీపురంబున వేదపురాణసంహితాధర్మశాస్త్రంబులు వక్కాణింపంగలవాఁడవు. ఇప్పు డొక్కహితంబు సెప్పెదఁ దుంగభద్రాతీరంబునఁ గిష్కింధాచలోపాంతంబున స్వామిమల యనుకాననంబునం గుమారస్వామి యధివసించియున్నవాఁడు. నీ వాచక్కటి కరిగి యతనివలన వారణాశిస్థానమాహాత్మ్యంబు వినుమని పలికి లోపాముద్రంగనుం

గొని యక్కాంతకు సుప్రకాశకటకహాటకకేయూరాదు లగు దివ్యాభరణంబులం బ్రసాదించె. ఇవ్విధంబునం గొల్లాపురమహాలక్ష్మీదేవిచేఁ బ్రసాదంబు వడసి దంపతులు చరితార్థులయి సముచితప్రకారంబున నమస్కరించి వీడ్కొని స్వామిమలకుం జనువా(రై) శైలకాననాయసంబు లరిగి సుందరతరగరోకమదపరిణతి దశాశా వస్తంభభిత్తిస్తంభ ముజ్జృంభమాన హేరంబదశనకులిశకఠోరకోటిభిద్యమానహాటకకటకటంకారఘట్టి (త) తాశాంగణంబై చతుర్ద్వారంబులను జతురంతరచతుష్పథద్వారంబులపాదశగవాక్షంబులద్వాత్రింశత్కరతోరణంబులఁజతుష్షష్టినాట్యశాలలంబులనుబంచాశదుత్తరసహస్రదీర్ఘికలను శతసహస్రకోటిలింగంబులను దశసహస్రకోటిశక్తులనుం గోటితీర్థంబులనుం గలిగి వరాహకుండమల్లికాకుండక్షీరకుండాదికుండంబులచేతనుఁగదళీవనబదరీవనగౌరీవనబిల్వవనాదిముఖ్యవనంబులచేతను హాటకేశ్వరగుప్తమాహేశ్వర నందిమండలనివృత్త్యాదు లయినదివ్యస్థానంబులచేతను రససిద్ధరసాయనసిద్ధిమూలికాసిద్ధిపాదుకాసిద్ధ్యాదు లగుసిద్ధక్షేత్రంబులచేతను శోభితంబై దివ్యామృతనిర్మల శ్రీస్వయంభూజ్యోతిర్లింగమూర్తియగుమల్లికార్జున శ్రీమహాదేవునకు నిజనివాసంబై యభిరామంబై దివ్యంబునగు శ్రీశైలంబుఁ జేరవచ్చె నయ్యవసరంబున. 51

అగస్త్యుండు శ్రీశైలంబున కేతెంచుట

మ. పరిరంభం బొనరించెఁ గుంభభవునిం బాతాళగంగాంబుని
ర్ఝరకల్లోలఘటాపృషద్వ్యతికరప్రాలేయముల్ హాటకే

శ్వరజూటీకృతమాల్యకేసరరజస్సౌరభ్యసంపన్నముల్
కరివక్త్రాభరణాహిపీతపరిముక్తంబు ల్పవనీవాయువుల్. 52

శా. ఆమిత్రావరుణాంశసంభవుని వింధ్యాటోపవిధ్వంసి లో
పాముద్రాసహితుం గనుంగొని రియుత్పన్నప్రమోదంబునన్
వ్యాసగ్రాహ్యపయోధరల్ కుటిలనీలాగ్రాలకల్ తథ్యమి
థ్యామధ్యస్థితమధ్యలాటవికసేవాధీశసీమంతినుల్. 53

సీ. వారాశిపదమునందు పాతాళగంగయం
దఘమర్షణస్నాన మాచరించె
హాటకేశ్వరదేవు నాగకేసరంబుల
నర్చించె వింధ్యదర్పాపహారి
గగనర్షివృషభుండు కంఠీరవానను
వైకుంఠబిలమధ్యవాసుఁ గొలిచె
నేకాంతరామేశు నిందుశేఖరుని ద
ర్శించె నీవారముష్టింపచుండు

తే. కూర్మి రంభోరువును దానుఁ గుంభభవుఁడు
కుంభినీధరదుహితృవక్షోజశాత
కుంభకుంభికాపరిరంభణోంభితాత్ము
శంభు శ్రీమల్లికార్జును సంభజించె. 54

మహాస్రగ్ధర. యమి హృల్లేఖాదిమంత్రాభ్యసననిరతుఁడై
యాగమోక్తప్రకార, క్రమయుక్తిం గంధపుష్పాక్షతదళ
ములశ్రీకంఠు నష్టాంగలక్ష్మిన్, భ్రమరాంబాదేవి నంతర్భ
మరఫలరసప్రహ్వచూతద్రుపుణ్యా, శ్రమవాటీహైమ
సింహాసనవిలసదధిష్ఠాన నర్చించె నిష్ఠన్. 55

తే. చెలువయును బాడు నాఁతఁడిలఁ బహాస్త్ర
పూర్ణశాఖోపశాఖలఁ బూనివరుఁడు
విధుకిరీటులఁ బూజించెఁ వెదకి వెదకి
సమ్మృతపుణ్యలింగమూర్తుల నధికభక్తి. 56

వ. వెండియు నయ్యల్వాలమథనుండు యథావిధి మంధాకకుండంబునఁ గ్రుంకె. పంచాక్షరీమంత్రసిద్ధుండు పంచధారాపస్తధారల నిర్ఝరప్రవాహంబులఁగృతావగాహుండయ్యెపాటల జటాకిరీటుండు హాటకకూటశిరః శృంగ శృంగాటకఘాటంబునఁ గోటిలింగంబులం భజించె. లోపాముద్రాధిపతి యద్రికటకభద్రాసనంబున సమున్నిద్రప్రతాపముద్రావిద్రుతాతుద్రోపద్రవుండగు సుద్యానవీరభద్రుశ్రీద్రవహారిద్రాక్షతంబుల భద్రదారుద్రుపారిభద్రద్రుమకోరకంబుల నారాధించె. బ్రహ్మర్షి బ్రహ్మపాదారవింద ద్వంద్వంబు హరిచందనచర్చామచర్చికల నర్చించె. సిద్ధతాపసమూర్ధాభిషిక్తుండు ఘంటాసిద్ధేశ్వరునివలన మంత్రసిద్ధి వడసె. మహాభాగుండు భోగవతీతీరంబున భోగేశ్వరు భోగాపవర్గప్రదు భుజంగభూషణు భజించె. నీ వారముష్టింపచుం డిష్టకామేశ్వరునకుం బటిష్ఠనిష్ఠావిశేషంబులం దుష్టిఁ గావించె. భువనగోప్తసప్తమాతృకలఁ దలంచె. నహుషదమనుండుముషితసకల కలుషంబగుకదళీవనవిషమభువి నిగమభషకపరిషదనుగతవృషభగమనుంగపటశబరభటు నట(?) దుహితృపరివృఢు నశఠమతిం గొలిచె. అనంతరంబ యొక్కవివిక్తప్రదేశంబున సుఖాసీనుం డై. 57

తే. అర్థిఁ గుంభోద్భవుం డిట్టు లనియె పలికెఁ
బద్మలోచన! చూడు శ్రీపర్వతంబు
పాయ కిం దుండుఁ బార్వతీప్రాణవిభుఁడు
మల్లికార్జునదేవుండు మదనవైరి. 53

తే. ధవళలోచన! శ్రీపర్వతంబుమహిమఁ
బ్రస్తుతింపంగ శక్యమే బ్రహ్మకైన
గండశిల లెల్ల శంభులింగంబు లిందు
సిద్ధముని లిండుఁ వసియించుచెంచు లెల్ల. 59

క. చాకున్న నీదు ముక్తుల
శ్రీకాశీక్షేత్ర మెవ్వరికి నిది నిక్కెం
పీకుధర మిచ్చు శిఖరా
లోకనమాత్రమున ముక్తులు కురంగాక్షీ. 60

వ. అనియె నప్పుడు లోపాముద్ర ముద్రికామణిమయూఖరేఖలు నఖర శిఖరంబులం జిగురొత్త విద్రుమప్రవాళంబుల యుల్లాసంబు నుల్లసంబాడెడుపాణిపల్లవంబులు మోడ్చి ఫాల భాగంబునం గదించిన వినయవినమితోత్తమాంగయై యున్నం గనుంగొని సస్నేహంబును సబహుమానంబును సానురాగంబును సాభిప్రాయంబును సమర్మంబును సవిభ్రమంబును సోపాలంభంబునుం గాఁ గుంభసంభవుండు మహాదేవి కి ట్లనియె. 61

సీ. హృదయంబులో సంశయించి నిగూఢార్థ
మిద మిత్థ మని నిశ్చయింపలేక
యది తేఁట తెలివిఁగా నడుగంగఁ దలఁచి ల
జ్జాసాధ్వసంబులు సందడింప

సవనప్రముఖకర్మ సక్తనైయున్న దానవు
ప్రాగ్భర్తృపుననే చెప్పితినో యంచు
మాటాడనేర విమాటలకుఁగవు నీవు
సకలకాలంబు నో సరసిజాక్షి!

తే. కాంత! యేకాంతవేళలఁ గాంతునెదుర
నగుచుఁ బెదరుచు నలుగుచు వగపుసూపి
పలికిపల్కక వెఱపునఁ గలసి చెనసి
యుండకుండుట మాబోఁటు లోర్వఁ గలరె? 62

వ. అనిన విని లోపాముద్ర మానముద్ర దిగద్రావి మునీంద్రున
కిట్లనియె. 63

సీ. చతురశీతియోజనాయతము మై యోజ
నోత్సేధమై భవాభ్యున్నతమయి
ముప్పదియోజనంబుల వెడల్పునఁ గల్గి
సార్ధత్రికోటితీర్థాన్విత మయి
సమధికాష్టాశీతిసాహస్రసంయమి
జనసమాకుల మయి సప్తకోటి
మంత్రాశ్రయం బయి మహనీయమహిమ మై
తనరారునీపర్వతంబునందు

తే. శిఖర మీక్షించునంతన చేరు నట్టి
ముక్తి జంతువులకు (మఱి) జీవములు దొరకంగ
జచ్చినప్పుడు గాని మోక్షంబు లేదు
కాశి కనుగొంగ నేటికిఁ గాల్గడాలి. 64

వ. మఱికొందఱు కేవలవిజ్ఞానంబుఁ బ్రశంసింతురు. కొందఱు
విజ్ఞానంబువలన సముచ్చితం బైనకర్మంబుఁ బరిశీలింతురు.

కొందఱు దానంబులు గొనియాడుదురు. కొందఱు వ్రతం బులు సెప్పుదురు. కొందఱు యజ్ఞంబులు మెత్తురు. కొందఱు తపంబులు గోరుదురు. కొందఱు బ్రహ్మచర్యం బభినందింతురు. కొందఱు గార్హస్థ్యంబుఁ బ్రశంసింతురు. కొందఱువానప్రస్థా శ్రమంబు మన్నింతురు. కొందఱు సన్న్యాసంబుఁ బ్రసంగిం తురు. కొందఱు తీర్థసేవ యావిష్కరింతురు. కొందఱుస్వా ధ్యాయంబు నధికరింతురు. కొందఱు కాశీశ్రీపర్వతాదిశివ స్థానంబు లభ్యర్థింతురు. ఇన్నియు నం క్తిస్థానంబులై యుండు నందులోపల సులభంబగుముక్తిస్థానం బెయ్యది? వినవలతు నానతిమ్ము. సంశయవీజభూతంబు లై యనావిప్రతిపత్తివచన సహస్రంబులు వినఁగ నాడెందంబు డోలాందోళనం బందు చుండు. 65

క. అని యడిగినఁ గలశసుతుఁ
డనుమోదరసార్ద్రహృదయుఁ డై దేవికి ని
ట్లనుఁ నడుగవలయునర్థము
వనజానన! యడిగి తుక్తివైభవ మలరన్. 66

{ అగస్త్యుండు లోపాముద్రకు బాహ్యాభ్యంతర తీర్థమాహాత్మ్యంబుఁ జెప్పుట }

శా. శ్రీశైలాదులు ముక్తికారణములై చెప్పంబడుం దీర్థముల్
ప్రాశస్త్యంబును నన్నితీర్థముల కప్రత్యూహమై వర్తిలుఁ
గాశీప్రాప్త(ప్తి)కరంబు లై నకతనం గైవల్యలక్ష్మీసహాల్
గాశీక్షేత్రముగై కొనుందరుణి! సాక్షాన్ముక్తిహేతుత్వమున్.

వ. ప్రయాగ నైమిశంబు కురుక్షేత్రంబు గంగాద్వారంబు నవంతిక యయోధ్య మధుర ద్వారక సరస్వతి సహ్యంబు

గంగాసాగరసంగమంబు కాంచి త్ర్యంబకంబు సప్తగోదా
వరంబు గాలంజరంబు బ్రభాసంబు బదరికాశ్రమంబు
మహాలయం బోంకారంబు పురుషోత్తమంబు గోకర్ణంబు
భృగుతీర్థం బంబుపుష్కరంబు శ్రీపర్వతంబు నా నివి మోక్ష
కారణంబు లైనమహాతీర్థంబులు. 68

సీ. శంభుప్రసాదంబు సమకూఱకుండినఁ
దీర్థయాత్రకు సమ్మతింప దాత్మ
దీర్థంబు లాడంగఁ దివుట లేకుండినఁ
బ్రతిబంధదురితంబు వాసిపోదు
ప్రతిబంధదురితంబు వాసిపోకుండినఁ
గాశి కేగెడునట్టికడఁక లేదు
శ్రీకాశీపురక్షేత్రవాసము లేక
విజ్ఞానదీపంబు విస్తరిలదు

తే. జ్ఞానమునఁ గాని మోక్షంబు సంభవింప
దతివ! జ్ఞానం బనంగ వేదాంతవాక్య
సంభవం బైన దదియ పోజ్ఞాన మంత్ర
తరుణి విజ్ఞాన మీసూక్ష్మ మెఱిఁగి కొనుము. 69

క. ధారాతీర్థం బనఁగాఁ
దారాధిపవదన! ఖడ్గధారాంచల మ
ద్ధారాంచలమునఁ ద్రెవ్విన
వీరాగ్రేసరుఁడు ముక్తివిభవముఁ గాంచున్. 70

తే. తీర్థములు మానసములు ముక్తిప్రదములు
తరుణి! యివి మేలు బాహ్యతీర్థములకంటె

మానవుం డివి యేమటి మధురవాణి!
బాహ్యతీర్థంబు లాడ నిష్ఫలము సూవె. 71
సీ. తీర్థంబు సత్య మింద్రియనిగ్రహము తీర్థ
మనసూయ తీర్థంబు వనరుహాక్షి!
తీర్థంబు దానంబు తీర్థంబు సంతోష
మనుకంప తీర్థంబు కనకగౌరి!
బ్రహ్మచర్యంబు తీర్థంబు తీర్థము ధృతి
యమము తీర్థము విద్రుమాధరోష్ఠి!
సమత తీర్థంబు విజ్ఞానంబు తీర్థంబు
పుణ్యంబు తీర్థంబు పువ్వుఁబోఁడి
తే. తీర్థములు మానసంబులు ధీవిశుద్ధి
యతిశయిల్లంగ నివి యాడ కాడినట్టి
పంచజనులకుఁ గలహంసపక్షిగమన!
బాహ్యతీర్థావలులు తీర్థఫలము నీవు.
చ. బిసరుహపత్రలోచన! కృపీటములందు మునింగియాడవే
మొసళులుమీలుకర్కటకముల్ గమఠంబులువానికబ్బునే!
యసదృశమైనతీర్థఫల మట్టివిధంబు సుమీ! తలంప మా
నస మగుతీర్థమాడనిజనంబులకుం బహుబాహ్యతీర్థముల్.
తే. సుదతి! యేటికి నంతర్విశుద్ధి లేని
బాహ్యసంశుద్ధి? బహుతీర్థపరిచయమున
వేయుఁగడవలజలమున వెలిఁ గడిగిన
గలుగునే శుద్ధి వారుణీకలశమునకు? 74.
తే. రాగదోషమలాపహారక్షమంబు
మానసం బైనతీర్థంబు మందగమన !

యుదని: బాకరబోవ్యపాయతమంబు
బాహ్యశ్రేష్ఠంబు మేచకోత్పలదళాక్షి! 75

సీ. పద్మించినపుడ చిత్తము నిర్నిబంధనం
బగుఁ బ్రసాదగుణంబు నందు నేనిఁ
గలుషంబు లేని సద్గంధంబుఁ బొరయని
సలిలంబు నెరముగాఁ గలుగు నేనిఁ
జానస్తోత్రపుణ్యావనీధరతపో
వనసన్నికర్షంబు దనరు నేని
శంసితవ్రతులైన సంయమిశ్రేష్ఠుల
యధికపరిగ్రహం బబ్బు నేనిఁ
తే. తీర్థములు వెదకులాడిన తీర్థమగునె?
ధవళలోచన! సలిలమాత్రమునఁ జేసి
ముదిత! దేహమునం దంగములకుఁ బోలెఁ
దారతమ్యంబు గలదు తీర్థముల కతివ. 76

వ. సారంగనయన! తీర్థాంగంబు లప్రతిగ్రహం బనహంకారం బకోపనత్వం బనాలస్యంబు సూనృతంబు సమాధానంబు శ్రద్ధధానత్వంబు హోమనిష్ఠ క్షేత్రోపవాసంబు పితృతర్పణంబు బ్రాహ్మణభోజనంబు పితృశ్రాద్ధంబు పిండప్రదానంబు శిరోముండనంబు మొదలుగాఁ గలయవి సాంగోపాంగంబు లయిఫలంబు నీఁజాలు. మఱియు తీర్థతారతమ్యంబు వివరించెద. 77

సీ. చెలువ! శ్రీగిరియందు శిఖరేశ్వరం బను
శిఖరంబుఁ జూచినఁ జేరు ముక్తి

కాంత! శ్రీశైలంబుకంటె వేగంబునఁ
గేదార మీఁ జాలుఁ గేవలత్వ
మంతకంటెను వేగ మరవిందలోచన!
యమృత మీనోపుఁ బ్రయాగతీర్థ
మాప్రయాగముకంటె నతివేగమునఁ జేయు
నపవర్గ మింతి! మహాశ్మశాన

తే. మతివ! యానందకాననప్రాప్తికరము
లఖిలతీర్థంబులును సందియంబు లేదు
కాశికాతీర్థ మాడక కదియరాదు
లక్షతీర్థంబు లాడిన మోక్షలక్ష్మి. 78

శివశర్మోపాఖ్యానము

వ. ఈయర్థంబు దేటపడ నొక్కయితిహాసంబు చెప్పెద వినుము. మధుర యనుపట్టణంబున శివశర్మ యనువిప్రోత్తముండు గలఁడు. అతఁడు వేదంబులుచదివి, తదర్థంబు లెఱింగి, ధర్మశాస్త్రంబులు పఠించి, పురాణంబు లధిగమించి, యంగంబు లభ్యసించి, తర్కంబు లాలోడించి, మీమాంసాద్వయం బాలోచించి ధనుర్వేదం బవగాహించి, యాయుర్వేదంబు విచారించి, నాట్యవేదంబు గ్రహించి, యర్థశాస్త్రంబు(లు) ప్రాపించి, మంత్రశాస్త్రంబు(లు) దెలిసి, భాషలు గఱచి, లిపులు నేర్చి, యర్థంబు (లు)పార్జించి, ధర్మంబులు చేపట్టి, భోగ్యంబు లనుభవించి, పుత్త్రుల నుత్పాదించి, వారి కర్థంబు విభజించి యిచ్చి, యౌవనంబు పోకకు ముదిమిరాకకు శోకించి వ్యాకులుం డయి నిజాంతర్గతంబున. 79

